# జాంగలికః కపిః

# మయూరః



('జమీన్‌రైతు' నుండి పునర్ముద్రణము)



నేలనూతల. శ్రీ. కృష్ణమూర్తి

సింహపురి.

# జాంగలికః కవిః మయూరః

(కొలంబియా విశ్వవిద్యాలయమువారి ప్రచురణలలో [illegible] రుని శ్లోకముల జార్జి పైన్ క్వేకర్‌బోస్ అంగ్లీకరించిన గ్రంథము ఈ వ్యాసమునకు పునాది.)

## I

## జాంగలికో మయూరః

మయూర బాణులు శ్రీ హర్షుని కొలువుకూటమి యందున్న ఆంతరంగికులు. సూర్య శతక మొకడును, చండీ శతకము మరొకడును వ్రాసి వారివారి భక్తి మహాత్మ్యముల చాటినారు. వీరికాలము 600–650 A. D. యని పరిశోధకులు నిర్ణయించినారు.

తాను రచించిన 'హర్ష చరిత్రము' న బాణుడు "జాంగలికో మయూరకః" అని చెప్పియున్నాడు. భుజంగ విషమును దగ్ధము చేయగల్గిన మయూరుడను విష వైద్యుడు తన బాల్యస్నేహితు డొకడున్నట్లు బాణుడు వర్ణించెను. ఇంతియగాక 10-వ శతాబ్దినాటి రాజశేఖర కవి :—

దర్పం కవి భుజంగానామ్ గతా శ్రవణగోచరమ్ ।
విష విద్యేవ మాయూరీ మాయూరీవాక్ నికృన్తతి ॥

(తా॥ మయూరకవి వాణి విన్న కవుల దర్పమడంగును. ఎట్లనగా మయూర విష విద్యచే పాముల శ్రీ అడంగినట్లు.)

1654. A. D. న, సూర్య శతకమునకు "భావబోధిని" వ్యాఖ్యానము రచించిన మధుసూదనుడు తన గ్రంథమున, రత్నావళీ కర్తయగు శ్రీ హర్ష చక్రవర్తి ఆస్థానమున మహాకవిద్వయమగు బాణమయూరు లున్నట్లును, బాణుడు 'కాదంబరీ' గ్రంథకర్త యనియు, అతని మామయగు మయూరుడు సూర్య శతక కర్త యనియు, వీరిద్దరకు వివాదములున్నట్లును చెప్పెను. రాజా మయూరుని కవిత్వ [illegible] [illegible] ఇచ్చిన శ్లోకముల విని, మయూరుని మెచ్చి, [illegible]

చెప్పి జోహారులు బడసినట్లును, తదుపరి శ్రీ హర్షుని మన్ననల బొందినట్లును తెలియు చున్నది.

1099 A. D. నాటి పద్మగుప్తకవి తన 'నవసాహసాంక చరిత' మందు బాణ మయూరులు ఒకేరాజు దర్బారున నుండిరనియు, ఈ కవులు వైరులుగనే విలసిల్లినట్లు వ్రాసినాడు. ఇందులకు కారణము శ్రీ హర్షుడే యనియు చెప్పెను.

సచిత్ర వర్ణవిచ్ఛిత్తి హారిణో రవనీశ్వరః ।
శ్రీ హర్ష ఇవ సంఘట్టం చక్రే బాణ మయూరయోః ॥

(నవసాహసాంకుడు ( సింధురాజు — పద్మగుప్తుని రచనయందలి కథానేత ) నెమళ్ల వేటాడబోయి వానిపై చిత్రవర్ణాక్షర ముద్రలున్న బాణములవేసి తన ప్రియురాలగు శశిప్రభకు వినోద విభ్రమముల చేకూర్చెను; ఎట్లనగా శ్రీ హర్షుడు బాణ మయూర కవుల కవిత్వ ప్రతిభలకు స్పర్ధకలిగించినట్లు—మయూరము, నెమలి అనగా మయూరకవి, బాణము-బాణకవి. నెమలిపై విసరిన బాణపరంపరపై వర్ణరచనముకలదు.

శంకర విజయ మను భగవత్పాదుల చరిత్రలు సాయణాచార్యుల సోదరు లైన మాధవులు, అనంతానందగిరి వ్రాసిరి. శ్రీ జగద్గురువులు అవంతిపురమున నిజ భాష్య శ్రవణోత్సుకులును, ప్రసిద్ధులగు బాణ మయూర దండి ముఖ్యుల దుర్మతాభి మానముల శిథిలీకృత మొనర్చినట్లు ఈ క్రింది శ్లోకము చాటుచున్నది. మాధవుల కాలము 14-వ శతాబ్ది.

“సకథాభిరవంతిషు ప్రసిద్ధాన్ విబుధాన్ బాణ మయూర దండి ముఖ్యాన్
శిథిలీకృత దుర్మతాభిమానాన్ నిజభాష్య శ్రవణోత్సుకాంశ్చకార”

## II

## జైనగ్రంథస్థమగు కథనము

జైన గ్రంథములందు బాణ మయూరుల ప్రతిభా తేజస్సులు మరొకవిధముగ [illegible]చేయుచున్నవి. దీనికి కారణము, జైనులు తమ 20 లేక 23 వ గురు పరంపర [illegible] మానతుంగుని ప్రాశస్త్య ముత్కర్షించ ప్రయత్నించి మన జంటకవుల కీర్తి వర్ణన

మయూరునకు స్వప్నమున సరస్వతి కనబడి వక్షస్థలమున నూత్నశర చంద్రుని గూర్చి సమస్యనిచ్చి పూరించమనెను.

జాగర్తి మయూరో వాణ్యాః శరచ్చంద్రం ।
వక్షస్థలం సమస్యా పదం వదస్వా అర్థోక్తికేన పఠేన ॥

వెంటనే ఆ కవిశ్రేష్ఠుడు స్వప్నదృష్టయగు వాగ్దేవికి నమస్కరించి;

“దామోదర కరాఘాత విహ్వలీకృత చేతసా ।
దృష్టం చాణూర మల్లేన శతచంద్రం నభస్థలం ॥

(తా॥ శ్రీకృష్ణుని చేతి దెబ్బతిని చిత్తవిభ్రమము చెందిన చాణూర మల్లునకు ఆకాశమున నూర్గురు చంద్రులగుపడెను.)

వాగ్దేవి మదమంది బాణుని స్వప్నమున ఈసమస్యనే పూరించమని పృచ్ఛించెను.

బాణోపి తత్రైవ పృష్టః । హుంకారం కృత్వాఽపి కథితా ॥

(నిద్రలో హుంకరించి బాణుడు ఆ సమస్య నిట్లు పూరించెను.)

తస్యాముత్తుంగ సౌధాగ్ర విలోల వదనాంబుజైః ।
విరరాజ విభావర్యాం శతచంద్రం నభస్థలం ॥

(తా॥ సౌధవిమానముల పైనున్న సుందరీమణుల వదనాబ్జములు ఆకాశమున నూర్గురు చంద్రులవలె విరాజిల్లినవి.)

అప్పుడా పలుకు చెలియ హుంకరించిన బాణుడు గర్వితుడని.,

“సర్వజ్ఞుడగు పండితుడే లేడు. ఎట్టి చదువరియు ‘నేనే పండితుడ’నని, తక్కున వారు మూఢులనుట పాపము.” మానవ పాండిత్య మెక్కుడును తారతమ్యములు కలది. పాండిత్య మపారమని ప్రణవమునై ప్రాసిన వ్యాఖ్యాన పరంపరల మీరు చూచితిరి. వినయులై జీవిత శేషమును గడుపుడురు గాక” యని దీవించి అదృశ్యమయ్యెను.

వారు, ఇద్దరును జ్ఞానోదయమును పొందిన వారై [illegible] గడిపిరి.

మయూరుని ప్రతిభ, కవిత్వ పటిమ తెల్లివిరియు చుండెను. సూర్యశతకమునకు వ్యాఖ్యానమురచించిన జయమంగళ కవి :—

భక్తమాయూర వక్త్రాబ్జ పదవిన్యాస శాలినీ ।
నర్తకీవ నరీ నర్తి సభామధ్యే సరస్వతీ ॥

(తా॥ మయూరకవి, వక్త్రాబ్జమందలి పదజాల విన్యాసములు సభామధ్యమున సరస్వతి యను నర్తకి లాస్య మొనర్చినట్లుండెను.)

## III
## సూర్యశతక ఆవిర్భావము

కొంతకాలమునకు మయూరునకు కుష్ఠరోగము కొద్దిగ చూపట్టెను. అద్దానినుండి మోక్షము పొందుటకు సూర్య శతకము చెప్పి ఆదిత్యుని సేవించి కనకసుందర శరీరము పొందెనని ఐతిహ్య మొక్కటిదానిని సూర్య శతక వ్యాఖ్యానమగు ప్రబంధ చింతామణి గ్రంథకర్త యజ్ఞేశ్వరుడు ఇట్లు వ్రాసియున్నాడు.

(దీనిని తన కావ్యప్రకాశమున ఝలంకీకారుడు ఉదహరించినాడు )

“మయూర కవేః కుష్ఠరోగ ప్రాప్తి కారణంతు భట్టయజ్ఞేశ్వర కృతాయాం సూర్యశతక టీకాయాం అభిహితం తథాహి । పురాకిల శ్రీ విక్రమార్క సమయాత్ అష్ట సప్తత్యుత్తర సహస్ర సమ్మితేషు 1078 సంవత్సరేషు (1022 క్రీస్తాబ్దేషు) వ్యతీతేషు సంప్రాప్తోదయస్య శ్రీ మద్భోజరాజస్య సభాపద్మరత్నదీపో మహాకవిర్మయూరో ధారానగరమ్ అధివసతిస్మ ।

తస్య చ భగినీపతిః కాదంబరీ గద్య ప్రబంధ నిర్మాతా బాణకవిః పరమ మిత్రం ఆసీత్ । అథ కదాచి న్మయూర కవిర్నిశః ప్రాంతే సంప్రాప్త ప్రబోధః కతిచిత్ పద్యాని కవయాం చక్రే । తానిచాతీవ సరస రమణీయాని అకలయ్య తదానీ మేవోత్కట సముత్కంఠావ కాన్నిజ సుహృదే బాణకవయే నివేదయితు — మాశాస్త్రదావాస భవనం అభిజగామ । తత్రచ బాణ కవిర్నిజ వల్లభామ్ మయూర స్వసారం మానకలుషితాం ప్రసాదయం స్తత్కాల కల్పితం :—

(1) గత ప్రాయారాత్రిః కృశతనుశశీ శీర్యత ఇవ;

(2) ప్రదీపోఽయం నిద్రావశం ఉపగతో ఘూర్ణిత ఇవ;

(3) ప్రణామాంతో మానస్త జసినతథాఽపి క్రుద్ధం అహో.

ఇతిపాదోనం పద్యం పఠిత్వా చరమ చరణ సంగతి కల్పయంస్తావ దేవ పాపత్యాం చక్రే । అత్రాఽవ సరే ఘనస్తని తస్యేవ గంభీరస్య బాణ కవి భామినస్య శ్రవణేన వివశాంతః కరణో మయూరకవిః స్వప్రతిభా ప్రవాహం నిరోధుం అతః మస్తత్పద్యే ఽపేక్షితం సుసంగతం చతుర్థ చరణం.

(4) "కుచప్రత్యా సత్త్యా హృదయ మపితే చండి కఠినమ్"

ఇతి ఏవం రూపం కేకా నినాద ఇవ మంద్ర మధురస్య రేణోదీరయామాస । తచ్ఛ్రుత్వా సజ్జధనుష్మ్యాగం బాణోలక్ష్యం ఇవాఽయం అపి బాణ కవిర్నిజ శామ్నోఽన్యస్థతా సమర్థనాయ (ఇవ) లీలా సద్మనో ఝటితి వినిర్గత్య ప్రాణాధికం ప్రియం సుహృద్వరం మయూరకవిం సమాజగామ । తతోఽస్యాబాణ వనితాయారస భంగజనిత మనఃక్షోభ వత్యాః పాతివ్రత్య ప్రాభవేణాఽచిరాదస్య పాపరోగస్య సమూలం ఉన్మూలనాయ శతసంఖ్యాక హృద్యతమ పద్య ఘటిత కావ్యబంధేన భగవంతం భాస్కర దేవం స్తుత్వా తత్ప్రసాద మహిమ్నా ప్రనష్ట పాప రోగః కనకరుచిర గాత్రోఽయం మయూరకవిః సంబభూవేతి । ఏవం తాత్పర్యక ఇతిహాసో మేరుతుంగాచార్యకృత ప్రబంధ చింతామణి– ఆది గ్రంథేష్ఠితః– ఇతి.

(తా॥ మయూరునకు కుష్ఠరోగ ప్రాప్తికి కారణ మీవిధముగ చెప్పబడినది. బాణకవి పత్ని మయూరుని తోబుట్టువు. మయూరుడొక రాత్రి మృదుమధుర రసయుత మగు శ్లోకములవ్రాసి బాణునకు చదివి వినిపింప బాణుని సదనమునకు పోయెను. బాణుడా రాత్రి ప్రణయ కలహాముకుండై, ప్రియురాలిని ఉత్కంఠతో వేడుకొనుచుండెను. ఆ బిబ్బోకవతి పతిపై అకారుణ్యాము నే చూపెను. బాణుడు కినిసి అంత్యప్రార్థనముగ అనువుగా శ్లోకమొకటి ప్రారంభించెను.

(1) ఓ కృశమధ్యా! రాత్రి చాల గడచినది. చంద్రుడును అస్తమించెను.

(2) దీపమును నిద్ర పైకివచ్చినట్లు మిణుకుమనుచున్నది.

(3) కోపము ప్రార్థనాంతమైనను, దర్పముతో నన్ను అంగీకరింపకున్నావు.

ఈ మూడు పాదములే చెప్పగల్గి, నాల్గవపాదము స్ఫురింపక చెప్పిన పాదములనే మరల మరల వచించుచుండెను. ఇట్టి బాణావస్థను చూచి, మయూరుడు కవిత్వకండూతిచే ప్రేరితుడై నాల్గవపాదము నిట్లు పూరించెను.

(4) ఓ చండీ ఏమి! గట్టిగనుండు కుచప్రాంతముకందున్న నీ హృదయము కాఠిన్యము వీడకున్నది.

బాణు డీపలుకులు విని విడిచిన బాణమువలె వెలికివచ్చి, తన ప్రియమిత్రుడగు మయూరుని కలసికొనెను. అంత బాణపతి తన పతివ్రతా మహిమచే, అవినీతిపరుడై రసభంగ మొనర్చిన మయూరుని "నీకు కుష్ఠరోగము ప్రాప్తించుగాక" యని శపించెను. (రోగపీడితుడైనందున రాజసభకు బాహ్యుడయ్యెను.)

అంత మయూరుడు నిశ్చల భక్తితో భాస్కరుని తలంచి శతశ్లోకములతో గొనియాడి, దేవప్రసాదియై కనకరుచిర గాత్రుడయ్యెను.

ఆ నూరు శ్లోకములును ఈ నాటికిని పాఠ్యయోగ్యములు. ఉపాసింప తగినవి. ఫలప్రదాయకములు. అందలి ప్రథమ శ్లోకము.

జంభారాతీభ కుంభోద్భవం ఇవ దధతః సాంద్ర సిందూర రేణుం ।
రక్తాఃసిక్తా ఇవౌఘై రుదయగిరి తటీ ధాతు ధారాద్రవస్య ।
ఆయాంత్యాతుల్యకాలం కమలవన రుచేవారుణావో విభూత్యై ।
భూయాసుర్భాసయంతో భువనం అభినవా భానవో భానవీయాః ॥

(తా॥ జంభారి ఐరావత కుంభస్థలమునుండు సిందూర రేణువులతో గూడినవో యనునట్లు ఒప్పినవియును,

ఉదయ పర్వత చరియలలోని గైరికాది ధాతువుల ద్రవముతో ఆర్ద్రితచే తడిసినవో అనునట్లుండు నవియు.

సమకాలమున వెంబడించెడి కమల వనపు కాంతిచే కెంజాయనైనవో యన్నట్లుండు నవియును యగు

సూర్యమయూఖములు మీకు శ్రీ సంపద నొసంగుగాక.

ఇట్లు మయూరుడు స్తుతించుతరి ఆరవ శ్లోకము చెప్పగనే, విగతరోగియై స్వర్ణ కాంతులతో వెలిసెను.

6 వ శ్లోకము.

శీర్ణ ఘ్రాణాంఘ్రి పాణీన్ వ్రణిభిరపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్ ।
దీర్ఘాఘ్రాతా నఘౌఘైః పునరపి ఘటయతి ఏక ఉల్లాఘయన్యః ॥
ఘర్మాంశోస్తస్యవోఽన్తర్ద్విగుణ ఘనఘృణానిఘ్ననిర్విఘ్నవృత్తేర్ ।
దత్తార్ఘాః సిద్ధసంఘైర్విదధతు ఘృణయశ్శీఘ్ర మంహోవిఘాతం ॥

(తా॥ పాపసమూహములచే వ్రణకులచే తినిపోయిన శరీరము, ముక్కు, పాదములు, హస్తములు కల్గి ఘర్ఘరమగు అవ్యక్తధ్వనులు చేసెడివారిని, మరల ఆయా యవయవములచే కూర్చినట్టి ఉష్ణకిరణునియొక్క, కొరట్టింపు దయాయుక్తమైన వృత్తిగలవాని యొక్క కిరణములు, సిద్ధసంఘంబు లొసంగిన అర్ఘ్యములను స్వీకరించి, మీ పాపముల శీఘ్రముగ శమింపజేయుగాక.)

101 వ శ్లోకమున ఫలశ్రుతి ఇట్లున్నది :—

శ్లోకాలోకస్య భూత్యై శతం ఇతి రచితాః శ్రీమయూరేణభక్త్యా ।
యుక్తశ్చైతాన్పఠేద్యః సకృదపి పురుషః సర్వపాపైర్విముక్తః ।
ఆరోగ్యం సత్కవిత్వంమతిం అతులబలం కాంతిం ఆయుఃప్రకర్షం ।
విద్యాం ఐశ్వర్యం అర్థం సుతం అపిలభతేసోఽత్ర సూర్యప్రసాదాత్ ॥

(తా॥ లోకహితార్థమై ప్రఖ్యాతుడైన మయూరునిచే భక్తితో నూరుశ్లోకములు రచించిబడినవి; మానవుడు భక్తిశ్రద్ధలతో నొకతూరి చదివిన పాప నాశమగును. సూర్యప్రసాదమున ఆరోగ్యము, సత్కవిత్వము, బుద్ధికుశలత, బలాతిశయము, తేజస్సు, ఆయుస్సంపద, ఐశ్వర్య పుత్రప్రాప్తి ధనమును బడయును.)

# IV
# మయూరుని ప్రతిభ

మయూరుని రాజాస్థాన జీవితముగూర్చి, బల్లాలకవి, 16 వ శతాబ్దిలో రచించిన భోజ ప్రబంధమం దుండు శ్లోకము లిందు కొన్ని వివరింపబడును. ఈ భోజ ప్రబంధము కేవల కల్పనాకథయని ఆధునిక పరిశోధకుల గట్టినమ్మకము. రసపిపాసు లగు సహృదయులకు, చారిత్రక మీమాంస అనుల్లంఘనీయమని విశ్వసించి కతిపయ శ్లోకములిందు పూరించడమైనది.

(1) భోజుని రాజాస్థానమున కొకనాడు, కటివస్త్రమాత్రుడైన నొక విద్వాంసుడు వచ్చెను. రాజు నామ మేమని యడుగ ఆ అతిథి కొంచమాలసించి తన్ను క్రీడాచంద్రుడని పిలతురని చెప్పెను, ఆ సభయందున్న కాళిదాసు, యీ సుకవినిగూర్చి శ్లోకార్థము చెప్ప, శేషార్థమును మయూరుడిట్లు పూరించెను :—

తేవంద్యాస్తే మహాత్మానస్తేషాం లోకేస్థిరంయశః ।
యైర్నిబద్ధాని కావ్యానియేచ కావ్యే ప్రకీర్తితాః ॥

(తా॥ కవిత్వ రాజ్యమున పేర్గాంచిన వారి కవిత్వ సంపద స్థిర యశస్సు సంపాదించును. అట్టి కవులు గౌరవార్హులు.)

(2) శుకదేవుడను కవి దారిద్ర్య మనుభవింపలేక భోజునికడ కరుదెంచెను. అతనిగూర్చి మయూరుడు ప్రభువుతో :—

దేవ! తథాఽపి ఉచ్యతే :—

కాసభా కిం కవి జ్ఞానం రసికాః కవయశ్చకే ।
భోజ కిం నామ తే దానం శుకస్తృప్యతియేనస ॥

తథాపి భవనద్వారం అగతః శుకదేవః సభాయాం ఆనే తవ్యఏవః ॥

(తా॥ ఈ శుకదేవుని సన్మానించనిచో ఏమి సభ? ఏమి కవిత్వము? ఏమి రసికావతంసులు? రాజా ఎట్టి పారితోషికముల నిచ్చి ఈ నూతన కవిని తృప్తిపరతువు.)

రాజు వెంటనే కవిని సన్మానించి, బంగారు పళ్ళెరమున పద్మరాగమణులనింపి కవికిచ్చెను.

(3) మయూరునిపై భోజునకు అకారణముగ కినుక కల్గెను. ఆ వృత్తాంత మిట్లున్నది.

ఏకదా క్రీడోద్యానపాల అగత్యైకం ఇక్షుదండం రాజ్ఞః పురో ముమోచ । తం రాజా కరే గృహీతవాన్ । తతో మయూర కవిర్నితాంతం పరిచయ మవశాద్ అత్మని రాజ్ఞా । కృతాం అవజ్ఞామ్ మనసి నిధాయేక్షు మిషేణాహ!

శ్లో॥ కాంతోఽసి నిత్యమధురోఽసి రసాకులోఽసి
కించాఽసి పంచశర కార్ముకం అద్వితీయం ।
ఇక్షో తవాఽస్తి సకలంపరం ఏకం ఊనం
యత్సేవితో భజసి నీరసతాం క్రమేణ ॥

రాజా కవిహృదయం జ్ఞాత్వా మయూరం సన్మానితవాన్.

(తా॥ భోజరాజు వాహ్యాళి వెలుపుచు రాజవనము చొచ్చెను. ఉద్యాన పాలకుడు చెఱకు వింటి నొకదానిని పెరికెను. దానిని రాజు చేతతీసికొనెను. ఆ ఇక్షు దండమును చూచి, ప్రచ్ఛన్నుడైయున్న మయూరకవి అన్యాపదేశముగ నిట్లనెను. "ఓ ఇక్షుదండమా నీవెంత సుందరముగ, నిత్యమధురత నిచ్చుచు, రసపూరితమై యున్నావు. అంతేగాక నీవు మన్మథుని కోదండముకదా? అన్నికళలు నీయందున్నవి. కాని ఒక్క లోపము కలదు. అయ్యది నిన్ను సేవించుకొలది నిస్సారమగుదువు.)

భోజుడు ఈ శ్లోకమందలి నిగూఢమగు కవి హృదయమును గ్రహించి మయూరుని సత్కరించెను.

## V

## మయూరునివని చెప్పు మఱికొన్ని శ్లోకములు

లాక్షణికులు మయూర కవనమును వక్రోక్తి అలంకారమున కుదాహరణముగ ఈ క్రింది శ్లోకార్థమును పేర్కొనియున్నారు. ఇయ్యది ఉమామహేశ్వరుల సంవాదము. అది రంగమున పాచికలాడు సమయమున, శివుని గెలిచేయుటకై దేవి పృచ్ఛించును. ఆ మాటలన్ను వేరు అర్థము చేసికొని చమత్కారముతో శివుడు ప్రత్యుత్తర మొసగును.

పార్వతి:— విజయే కుశలస్త్ర్యక్షో నక్రీడితుం అహం అనేన సహాశక్తా;

(తా॥ ఓ విజయా (చెలికత్తె) త్రినేత్రుడు అక్షక్రీడయందు కుశలుడు. నేను అత నితో పాచికలాడను.)

శివుడు:— విజయే। కుశలోఽస్మి నతు త్ర్యక్షో అక్షద్వయం ఇదం పాణౌ।

(తా॥ ఓ విజయము పొందగలదానా, నేను కుశలుడనే, కాని నావద్ద ఆటకు వలసిన మూడు అక్షములు లేవు. నాపాణి (చేతుల) యందు రెండేయున్నవి.)

పార్వతి:— కింమేమనోదరేణ ప్రయాతుయదిగణ పతిర్న తేఽభిమతః

(తా॥ నాకేమిటికీ ఈ పాచికలయాట.)

శివుడు:— కః ప్రద్వేష్టి వినాయకం అహిలోకః కిం నజానాసి

(తా॥ భూరి ఉదరముగల గణేశుడు అడ్డమున్న, ఈ విఘ్నపు మానిసిని పంపి వేయుము. — వినాయక యనిన గరుత్మంతుడు—ఇతడు అహి—పాములవైరి. కావున మన వినాయకుని వేరు చేసెదనని తాత్పర్యము.)

పార్వతి:— వసురహితేన క్రీడాభవతా సహాకీదృశేన జహ్రేషి.

(తా॥ ఏమి ఆట ఇది. పణముంచుటకు ధనములేని దరిద్రులవైనారు. సిగ్గవలేదా!)

శివుడు:— కింవసుభిర్మమతోఽమూన్సురాసురా ఏవపశ్యపురః

(తా॥ వసువులు — పాములతో నీకేమిపని, అల్లదిగో చూడుము సురాసురులెల్లు నమస్కరించుచున్నారో)

పార్వతి:— చంద్రగ్రహణేన వినానాఽస్మిరతా కిం పరివర్తయసీదం

(తా॥ ఆ చంద్రుని పణముంచి గెలువకున్న నాకు సంతోషముండదు. ఎందుకిట్లు పరిహసింతురు.)

శివుడు:— దేవ్యై యదిరుచితం ఇదం నంది న్నాహూయతాంరాహుః

(తా॥ ఓ నందీ! (చంద్రగ్రహణము కొఱకై) రాహువు పిలిచిరమ్ము. దేవికి చంద్రగ్రహణము కుతూహలమిచ్చునట.)

పార్వతి :—హా! రాహో శ్శితదంష్ట్రే భయాకృతౌ నికటస్థితే రతిః కస్య ॥

(తా॥ అయ్యో! కోరలుకల్గి భయంకరుడు రాహువు ఉన్నచో రతి యెట్లు?

శివుడు :—యది నేచ్ఛసి సంత్యక్తః సంప్రతి ఇహైవ మహారాహిః ॥

(తా॥ నా పాములదండ, నీ కిష్టములేనిచో, ఓసివైచెదను. (రాహువు పామనియు కలదు.)

ఇప్పటికి దేవికి కోపము హెచ్చినది.

పార్వతి :—అకోపమయసి మూఢా కిం నాఽహం అభిజ్ఞా కిలత్వదంకస్య ॥

(తా॥ ఏమిట్లు మూఢత్వమున వ్యంగ్యార్థములు తీయుచున్నారు. మీ పాముల పరమును తెలియని మూఢురాలను గాను.)

(త్వదంక మనగా, ఆభరణమని అర్థము.)

శివుడు :—దివ్యం వర్షసహస్రం స్థిత్వేతి నయుక్తం అభిధాతుం ॥

(తా॥ ఏమి! నా అంకము నీకు తెలియదా? శతసహస్ర సంవత్సరములు నా యంకస్థవైయుండి, ఇట్లనతగునా?)

కవి హేళన మింతకన్న మించిపోవుట, అది దంపతులయెడ అపచారమని ఆశీస్సు తెలుపుచున్నాడు.

ఇత్థం పశుపతి కేళిపాళిక లీలాప్రయుక్త వక్రోక్తిః ।

హర్షవశతరళ తారకం ఆననం అవ్యాద్భవాన్యాః ॥

(తా॥ స్మితవదనయు, లోలితాక్షియునగు భవాని మీకు అభయమిచ్చుగాత!

ఈ దేవితో పశుపతి (భూతముల రక్షించు నాథుడు) అక్షక్రీడా సమయమున వక్రోక్తి భాషణ లాడుచుండెను.)

ఈ మయూరకవి తన భావములను రంగులతో, మాటలను చిత్రించి, అస్ఫస్ఫోరకముగా చిత్రవర్ణనల చేయగల కౌశల చిత్రకారుడు. మచ్చునకు గోవత్సములగూర్చి చెప్పిన మృదుతమమగు కవనము.

ఆ పాత్యాఽఽపాత్య మూర్ద్నాద్రుతం అనుపిబతః ప్రస్నుతం మాతురూధః ।
కిం చిత్కుబ్జైః జానోరనవరత చలచ్చారు పుచ్ఛస్యధేనుః ।
ఉత్కర్ణం తర్ణకస్య ప్రియతనయ తయాదత్త హుంకారముద్రా ।
విస్రంసత్క్షీరధారా లవశబలముఖస్యాంగం ఆతృప్తిలేఢిః ॥

(తా॥ వత్సము ఆకలితో మాటిమాటికి తలతో పొదుగును కుమ్ముచు స్రవించు పాలను త్రాగుచు, మోకాలి నొకదానిని వంచి, చిన్నితోకను ముదముతో ఆడించుచున్నప్పుడు; తల్లి ధేనువు వాత్సల్యపూరితముగ, నిక్కబొడిచికొనిన చెవులుగల్గి త్రాగుపాలు ముక్కలనుండి జారుచున్న తన దూడను, తన తృప్తిదీరువఱకు జిహ్వతో లేహనము చేయును.)

ప్రతిభావంతులగు కవులు మనపాలిటి కామధేనువులు. వారి కవనములే మనకు లభించు గోక్షీరములు. వారి వాత్సల్యముచే, మనము ఆ కవిత్వ క్షీరముల నాస్వాదించి, మనసంస్కారబలమును పోషించుకొని, మన సాంప్రదాయములను పదిలపఱచుకొనగల్గుచున్నాము. మహాకవుల కందరికిని మనజోహారులు.

ఇ తి శ మ్.